శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః

# శ్రీదేశికచరిత్రసంగ్రహం





'పండితరత్న' డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అగ్రహార శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# శ్రీదేశికచరిత్రసంగ్రహం

## 1)ఉపోద్ఘాతం

సంసారసముద్రంలో మునిగి తపించే జీవులను తరింపజేయాలని సంకల్పించిన భగవంతుడు రామకృష్ణాది అవతారాలను ఎత్తి, ఆ కాలంలో ఉండే జనులను తరింపజేయాలని ప్రయత్నించాడు. కానీ, తన మనోరథం పూర్తిగా నెరవేరనందున అళ్వార్లను, ఆచార్యులను అవతరింపజేసి, వారు అనుగ్రహించిన అమృత ప్రవాహాలవంటి శ్రీసూక్తులతో జీవులను మంచి మార్గం అనుసరించేటట్లు చేశాడు. అటువంటి వారిలో ప్రధానులు నమ్మాళ్వారులు, నాథమునులు శ్రీయామునులు, భగవద్రామానుజులు మొదలైనవారు. వారు, మన మతంలో ఇతరమతాలవారు పలికే దోషాలను అన్నిటినీ తొలగించి, శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతమే ప్రమాణాలకు అనుగుణం అని చూపించి, అది సాటి లేకుండా వెలిగేటట్లు చేశారు. అళ్వారుల శ్రీసూక్తుల వలననే, శ్రీయామునులు, శ్రీభాష్యకారులు మొదలైన పూర్వాచార్యుల శ్రీసూక్తుల వల్లనే ఈనాడు విశిష్టాద్వైత సిద్ధాంతంలోని విషయాలను, దాని అరుదైన గొప్పతనాన్ని పండితులు అందరూ సులభంగా, చక్కగా తెలుసుకోవడానికి వీలు అవుతున్నది. వేదాలను, స్మృతులను పూర్తిగా అనుసరించిన ఈ సిద్ధాంతం సంస్కృతం, ద్రావిడం అనే ఉభయ వేదాంతాల సమన్వయంవల్ల చాలా ప్రకాశాన్ని పొంది ప్రకాశిస్తున్నది.

## 2)శ్రీవేదాంత దేశికుల అవతార కారణం

ఈ విధంగా ఆళ్వారులు, శ్రీ రామానుజులు మొదలైన పూర్వాచార్యులవరకు ఉండే మహానుభావులు అందరు అనుగ్రహించిన దివ్యసూక్తులలోని తాత్పర్యాన్ని, మతసిద్ధాంతాలను, రహస్యార్థాలను ఇంకా విరివిగా తెలుసుకొని, జీవులు ఆనందించి తరించడానికి అతి విలక్షణమైన వేరొక అవతారం చాలా ఆవశ్యకం— అని భగవంతుడు భావించాడు. ఇంతకుముందు, దీనికి తరువాత కూడా ఇటువంటి గొప్పతనాన్ని కలిగిన వేరొక అవతారం లేదు— అనే విధంగా శ్రీవేంకటేశ్వరుడు తన ఆలయంలోని గంట అంశను పురస్కరించుకుని, అందులో తాను అనుప్రవేశించి, తరువాతివారు శ్రీభాష్యకారుల అవతారమే అనేటట్టుగా శ్రీదేశికులను అవతరింప చేశాడు. ఈ మహాచార్యులవల్లనే మన భగవద్రామానుజ సిద్ధాంతం మరింత వికసించి ప్రకాశిస్తున్నది అని చెప్పాలి. ఇటువంటి మహారత్నాన్ని ఆచార్యునిగా పొందిన శ్రీవైష్ణవసమూహం గొప్ప అతిశయాన్ని, సాత్వికాహంకారాన్ని పొందడంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

## 3) శ్రీదేశికుల అవతారం

శ్రీ వేదాంత దేశికులు తిరుత్తణ్ కా అనబడే దీపప్రకాశ స్వామి సన్నిధికి దగ్గరలో ఉండే తూప్పుల్ అనే పరిశుద్ధమైన చోట, ఇప్పటికీ సుమారు 750 సంవత్సరాలకు ముందు భాద్రపదమాసం శ్రవణా నక్షత్రంలో జ్ఞానానుష్ఠానాలను గొప్పగా కలిగిన శ్రీమదనంతసూరి అనే మహానుభావులకు, వారికి ధర్మపత్ని అయిన తోతారంబకు వారి

అరుదైన తపఃఫలంగా అవతరించారు. ఇటువంటి భాగ్యవిశేషాన్ని పొందిన తల్లిదండ్రులు లోకంలో మరొకరు ఎవరైనా ఉన్నారా? శ్రీవేంకటేశ్వరుని అవతారదివసంలోనే అవతరించడాన్నిబట్టి వీరికి వేంకటేశులు అనే పేరును తల్లిదండ్రులు పెట్టారు. శాస్త్రవిధిని అనుసరించి వీరికి ఉచితకాలంలో జాతకర్మ మొదలైన సంస్కారాలు చేయబడ్డాయి. దినదిన ప్రవర్ధమానంగా పెరుగుతూ వచ్చిన వీరికి అక్షరాభ్యాసం కూడా చేయబడింది.

## 4)అమ్మాళ్ అనుగ్రహాన్ని పొందడం

ఒకనాడు వేదాంత దేశికులు తమ మేనమామ అయిన కిడాంబి అప్పుళ్ళార్ తో పాటుగా నడాదూర్ అమ్మాళ్ కాలక్షేప గోష్ఠికి వెళ్లడం సంభవించింది. చాలా చిన్న బాలుడై ఉండే వేదాంతదేశికుల దివ్య తేజస్సును అక్కడ ఉండేవారు అందరూ చూచి ఆశ్చర్యపడ్డారు. అమ్మాళ్ కూడా ఆ బాలుని ముఖంలో బాల్యంలోనే ప్రకాశించే దివ్యతేజస్సును చూచి, మిక్కిలిగా ఆశ్చర్యపడ్డారు. తమ కాలక్షేపాన్ని నిలుపు చేసి, బాలుడైన వేదాంతదేశికులను తమ దగ్గరకు పిలిచి, ఆలింగనం చేసికొని, అతడు ఒక అవతార పురుషుడే అని గమనించారు. ఈ బాలుడు భవిష్యత్తులో భగవద్రామానుజ దర్శనాన్ని నిర్వహించి, అభివృద్ధి చేయగలడు– అని గ్రహించారు. వేదాంతదేశికులను ఆశీర్వదిస్తూ "ఇతర మతాలను ఖండించి, మన సిద్ధాంతాన్ని స్థాపించి, విద్వాంసుల గొప్ప గౌరవాన్ని పొంది, సకల మంగళాలను ఇతడు పొందగలడు" అని అన్నారు తామే స్వయంగా వేదాంతదేశికులకు

ఆచార్యులు కావాలి అని అమ్మాళ్ ఆశపడినప్పటికీ, తమ వార్ధక్యాన్ని భావించి, తమకు ఆ భాగ్యం పొందే అవకాశం లేదు—అని గ్రహించి, తమకు ప్రియ శిష్యులైన అప్పుళ్ళార్ ను సకల శాస్త్రాలను ఆ బాలునకు ఉపదేశించే బాధ్యతను అప్పజెప్పారు. అప్పుళ్ళార్ కూడా ఆ బాలుని "అమ్మాళ్ అనుగ్రహించినట్టుగానే ఇతడు అన్ని విధాలైన అతిశయాలను పొందగలడు" అని ఆశీర్వదించారు.

## 5)దేశికుల విద్యాభ్యాసం

అప్పుళ్ళార్ దేశికుల వెంటనే ఉండి, అన్ని విధాలుగా సహాయపడుతూ వారికి పంచసంస్కారాలను అనుగ్రహించారు. అమ్మాళ్ నియమించిన విధంగా వేదాంతదేశికులను సర్వశాస్త్రపారంగతునిగా తీర్చిదిద్దడంలో సకలబాధ్యతలు తమకే ఉన్నందున అప్పుళ్ళార్ దేశికులచే వేదాధ్యయనాన్ని, దివ్యప్రబంధాధ్యయనాన్ని చేయించారు. తర్కం, వ్యాకరణం మొదలైన సమస్త సామాన్యశాస్త్రాలను నేర్పించారు. శ్రీదేశికులు తమకు మేనమామ, ప్రధానాచార్యులు అయిన అప్పుళ్ళార్ దగ్గర రహస్యార్థాలను శ్రవణం చేసి, శ్రీగీతా భాష్యం, శ్రీభాష్యం, భగవద్విషయం మొదలైన ఆచార్య శ్రీసూక్తులను అన్నిటిని కాలక్షేపం చేసి పూర్తి చేశారు. 20 సంవత్సరాల వయస్సు పూర్తి అవడానికి ముందే దేశికులు సకల శాస్త్రాలను పరిపూర్ణంగా నేర్చి, ఉభయ వేదాంతాలలో సాటి మేటి లేని జ్ఞానంతో, మిక్కిలి ప్రవచన శక్తిని పొంది ప్రకాశించారు. అపుడువారి మేధావిలాసాన్ని చూచి ఆశ్చర్యపడనివారు లేరు. అప్పుళ్ళార్ కూడా శ్రీనాథమునుల ద్వారా ప్రాప్తమై, శ్రీయామునులచేత

వృద్ధి చేయబడి, శ్రీభాష్యకారులచేత చక్కగా రక్షింపబడి, తమ వరకు వచ్చిన విశిష్టద్వైత సిద్ధాంతాన్ని ఇంకా ఇంకా ప్రకాశాన్ని పొందేటట్లు రక్షించి, ప్రచారం చేయడానికి ఒక గొప్ప అధికారి లభించినందున చాలా ఆనందాన్ని పొందారు. తరువాత తమకు పరంపరగా వచ్చిన గరుడ మంత్రాన్ని శ్రీదేశికులకు ఉపదేశించారు.

## 6)వివాహం

భగవద్భక్తి మొదలైన గుణాలు నిండుగా ఉండి ప్రకాశించే ఉన్నతమైన కుటుంబంలో పుట్టి, తమకు అనురూపవతియై ప్రకాశించే తిరుమంగైయార్ అనే కన్యకను శ్రీదేశికులు తమ తల్లిదండ్రుల నియమనం ప్రకారం వివాహం చేసుకున్నారు. మన సిద్ధాంతాన్ని ప్రచారం చేయడంలోనే ఎక్కిలి ఆసక్తిని కలిగిన దేశికులు గృహస్థాశ్రమంలో ఎక్కువ ఆసక్తి లేనివారై, మిగిలిన గృహస్థ ధర్మానుష్ఠానాలను మాత్రం విధి తప్పకుండా ఆచరించారు. దేశికుల జ్ఞానాన్ని, ప్రవచనశక్తిని చూచి పలువురు విద్వాంసులు స్వామిని ఆచార్యునిగా వరించి, వారి వద్ద కాలక్షేపాన్ని శ్రవణం చేశారు.

## 7)అప్పుళ్ళార్ పరమపద ప్రాప్తి

క్రమంగా అప్పుళ్ళార్ కు వార్ధక్యం ఎక్కువ అయినది. శరీరంలో శక్తి తగ్గింది. తమకు చరమకాలం సమీపించిన విషయాన్ని వారు గ్రహించి, శ్రీదేశికులను పిలచి, శ్రీభాష్యకారుల పాదుకలను, పంచసంస్కారానికి తాము ఉపయోగపరచే సుదర్శన పాంచజన్యాలను వారికి ఇచ్చి, తమ

శ్రీచరణాలను శ్రీదేశికుల తలపై పెట్టి, అనుగ్రహించారు. శ్రీదేశికులు వాటిని పొంది, తమ నిత్యారాధనలో పెట్టుకున్నారు. తరువాత, కొంతకాలానికి అప్పుళ్ళార్ పరమపదాన్ని చేరారు.

## 8)గరుడ భగవానుని అనుగ్రహం

కొంతకాలం గడిచిన తరువాత శ్రీదేశికులు తిరువహీంద్రపురానికి వెళ్లి, అక్కడ నెలకొని ఉండే దైవనాయక స్వామిని, దివ్యదేవేరిని సేవించి, వారికి మంగళాశాసనం చేశారు. అక్కడ ఉండే ఔషధాద్రి అనే ప్రసిద్ధిని పొందిన పర్వతాన్ని ఎక్కి శ్రీనృసింహస్వామి సన్నిధికి ఎదురుగా ఒక అశ్వత్థవృక్షం మొదట కూర్చుని, గరుడ మంత్రాన్ని ఆవృత్తి చేసి, జపించారు. దానికి గరుడుడు చాలా సంతోషించి, దేశికులకు ప్రత్యక్షమయ్యారు. వారికి హయగ్రీవమంత్రాన్ని ఉపదేశించి, యోగాసనంలో ఉండే ఒక హయగ్రీవుల విగ్రహాన్ని కూడా ఇచ్చి కృప చేశాడు.

## 9)హయగ్రీవుల సాక్షాత్కారం

శ్రీదేశికులు గరుడ భగవానుని అనుగ్రహం వల్ల లభించిన హయగ్రీవ మంత్రాన్ని జపించి, ఆ స్వామినే ధ్యానిస్తూ ఉన్నారు. హయగ్రీవస్వామి దానివల్ల చాలా సంతోషించినవాడై, దేశికుల ముందు ప్రత్యక్షమయ్యాడు. వారిని అనుగ్రహించి, వారికి గొప్ప జ్ఞానాన్ని, ప్రవచన శక్తిని మరింత వృద్ధి అయ్యేటట్లు చేసి, సాటి లేకుండా వెలిగే గొప్పతనాన్ని వారు పొందాలని తలచి, పవిత్రమైన తన లాలాజలాన్ని

వారికి ఇచ్చాడు. తరువాత దేశికులు హయగ్రీవ స్తోత్రం, గరుడ పంచాశత్ దేవనాయక పంచాశత్, అచ్యుతశతకం మొదలైన సంస్కృత స్తోత్రాలను, ముమ్మణి క్కోవై, నవ మణిమాలై మొదలైన ద్రావిడ గ్రంథాలను అనుగ్రహించి, ఆ ఊరిలోనే ఉంటూ, సిద్ధాంత ప్రచారాన్ని చేస్తూ చిరకాలం గడిపారు.

## 10)కాంచీపురానికి దేశికులు తిరిగి రావడం

కొంతకాలం గడచిన తరువాత దేశికులకు కాంచీపురంలో వరదరాజస్వామిని సేవించాలి అనే ఆశ, ఆసక్తి ఎక్కువ అయినది. వెంటనే వారు కాంచీపురానికి బయలుదేరారు. దారిలో, ముదలాళ్వార్లను భగవంతుడు అనుగ్రహించి, వారిద్వారా దివ్య ప్రబంధాలను పాడించిన తిరుక్కోవలూర్ కు వెళ్ళి, అక్కడ ఉండే స్వామికి మంగళాశాసనం చేసి, దేహళీశస్తుతి అనే స్తోత్రాన్ని అనుగ్రహించారు. తరువాత, కాంచీపురానికి వెళ్ళి, అక్కడ ఉండే పెరుందేవి త్తాయారును, వరదరాజస్వామిని పరిపూర్ణంగా సేవించి, న్యాసదశకం వరదరాజ పంచాశత్ మొదలైన స్తోత్రాలను, అడైక్కల ప్పత్తు, అర్థపంచకం మొదలైన ప్రబంధాలను అనుగ్రహించారు. కాంచీపురానికి దగ్గరలో ఉండే తిరువెక్కా, తిరుప్పుట్కుழி మొదలైన అనేక దివ్యదేశాలలో ఉండే భగవన్మూర్తులకు మంగళాశాసనం చేసి, వేగాసేతు స్తోత్రం మొదలైన అనేక స్తోత్రాలను రచించి, కాంచీపురంలోనే కొంత కాలం ఉన్నారు వరదరాజస్వామిని చక్కగా సేవిస్తూ కాలాన్ని గడపారు. సంప్రదాయ పరిశుద్ధి మొదలైన చిల్లర రహస్య గ్రంథాలను, అనేక వేదాంత గ్రంథాలను

అక్కడ కృప చేశారు. అప్పుడు శ్రీ భాష్యకారులకు సరస్వతీ దేవిచేత సమర్పింపబడిన ఒక శ్రీ హయగ్రీవవిగ్రహం అప్పుళ్ళార్ సంతతి ద్వారా శ్రీదేశికులకు లభించింది. శ్రీదేశికులు దానిని తమ ఆరాధనలో పెట్టుకొని ఆరాధిస్తూ, శిష్యులకు సంప్రదాయప్రవచనాన్ని చేస్తూ, కాలాన్ని గడపసాగారు.

## 11)తిరుమలకు వేంచేయడం

దేశికులకు తిరుమలలో వేంకటేశ్వర స్వామిని సేవించాలి అనే కోరిక కలిగింది. వారు కాంచీపురంనుండి బయలుదేరి, మధ్యలో ఉండే ఘటికాద్రి మొదలైన దివ్య క్షేత్రాలను సేవించి, క్రమంగా తిరుపతికి చేరారు. అక్కడ స్వామిని పరిపూర్ణంగా సేవించి, ఆ స్వామి విషయంలో, ఆ స్వామి దయను స్తుతిస్తూ దయాశతకం అనే చాలా మధురమైన స్తోత్రాన్ని రచించారు.

## 12) ఉత్తరదేశ యాత్ర

తరువాత దేశికులకు ఉత్తరదేశంలో ఉండే అనేక దివ్యదేశాలను సేవించాలని ఆశ కలిగినందున, వారు తిరుమలనుండి బయలుదేరి, బృందావనం తిరువయోధ్య, సాలగ్రామం, బదరికాశ్రమం మొదలైన దివ్యదేశాలకు మంగళాశాసనం చేసి, తిరిగి కాంచీపురానికి బయలుదేరారు. దారిలో తిరువల్లిక్కేణి, తిరువళ్ళూరు మొదలైనది దివ్యదేశాలను సేవించి, అక్కడ ఉండే అర్చామూర్తులకు మంగళాశాసనం చేసి, శ్రీపెరుంబూదూరులో శ్రీరామానుజులను కళ్ళారా

సేవించి, చాలా ఆనందించారు. తరువాత, కాంచీపురానికి తిరిగి వచ్చి సిద్ధాంత ప్రవచనంతో కాలాన్ని గడపారు.

## 13)దేశికులకు పుత్రోదయం

కొన్ని దినాలు గడచిన తరువాత, శ్రీ వరదరాజ స్వామి అనుగ్రహం వల్ల శ్రావణ మాసం రోహిణి నక్షత్రంలో శ్రీదేశికులకు ఒక కుమారులు అవతరించారు. శ్రీదేశికులు తమకు కలిగిన ఆ కుమారునకు వరదరాజస్వామి పేరుతో వరదుడు అనే నామకరణం చేసి, తగిన కాలంలో ఆ యా సంస్కారాలను, ఉపనయనాన్ని చేసి, విద్యాభ్యాసాన్ని కూడా చేయించారు. వారు కూడా, తమ తండ్రిగారి సన్నిధిలోనే పంచసంస్కారాలను పొంది, రహస్య గ్రంథాలు మొదలైన సంప్రదాయ గ్రంథాల కాలక్షేపాన్ని చేసి, విశేషమైన జ్ఞానాన్ని పొంది, దీపంనుండి పుట్టిన ప్రదీపంవలె వెలిగారు.

## 14)అన్యమతానికి చెందిన సన్యాసిని జయించడం

అన్యమతానికి చెందిన ఒక సన్యాసి దేశికులతో వాదించాలని వచ్చి, వారి దగ్గర అపజయాన్ని పొందాడు. అతడు ఒక మంత్రవాది కనుక, దేశికులకు హాని కలిగించాలి అని ప్రయత్నించి, ఒక సరస్సులో నీటిని పీల్చడం ఆరంభించాడు. దానివల్ల దేశికుల కడుపు ఉబ్బి పోవడం ఆరంభించింది. ఈ దుశ్చర్యను తెలుసుకున్న దేశికులు తమకు దగ్గరగా ఉండే ఒక స్తంభాన్ని తన గోటితో గీరగా, ఆ స్తంభంనుండి జలం బయటకు వచ్చింది. స్వామి కడుపుకు ఏర్పడిన బాధ తీరింది. సన్యాసి

ఈ విషయాన్ని గమనించి, దేశికుల దగ్గరకు వచ్చి, అపరాధ క్షమాపణాన్ని ప్రార్థించి వెళ్ళిపోయాడు.

## 15)వైరాగ్యంలోని పరాకాష్ఠ

శ్రీదేశికుల జ్ఞానానుష్ఠానాలను విన్న, వారికి చిన్నతనంలో స్నేహితుడైన విద్యారణ్యులు అనే విద్వాంసులు ప్రభువు ఆదరం పొందినవారు కనుక, దేశికులకు ప్రభువు ద్వారా తన సహాయాన్ని కలిగించి సహాయం చేయాలని భావించి, రాజసభకు రమ్మని ఒక పత్రికను దేశికులకు పంపించారు. వైరాగ్యానికి ఆశ్రయం అయిన దేశికులు సంపదలోని నైచ్యాన్ని, అది స్థిరంగా ఉండని స్వభావాన్ని కలిగిన విషయాన్ని, ఏనాటికీ నశించని సంపద అయిన వరదరాజస్వామిని తప్ప తాము దేనిని అన్వేషించని స్వభావాన్ని వివరించే అందమైన శ్లోకాలతో కూడిన వైరాగ్య పంచకం అనే ఒక స్తోత్రాన్ని రాసి, విద్యారణ్యుల దగ్గరకు పంపించారు. విద్యారణ్యులు దానిని చూచి చాలా ఆశ్చర్యపడ్డారు.

దేశికుల కళ్యాణ గుణాలలో చాలా గౌరవాన్ని కలిగిన కొందరు ఆస్తికులు భగవదారాధనకు సాధనమైన ద్రవ్యాలను భక్తితో తీసుకుని వచ్చివారికి సమర్పించినప్పుడు, బియ్యంతో పాటు కొన్ని బంగారు నాణాలను కూడా కలిపి వారికి సమర్పించారు. వైరాగ్యనిధి అయిన దేశికులు వాటిని చూసి గమనించి, వాటిని దూరంగా పారవేశారు. ఇంతటి గొప్ప వైరాగ్యాన్ని కలిగినవారు శ్రీదేశికులు.

## 16)శ్రీరంగంలో ఇతర మతాలకు చెందిన వాదులను జయించడం

ఆ సమయంలో ఇతర సిద్ధాంతాలకు చెందిన కొందరు శ్రీరంగానికి వచ్చి, అక్కడ ఉండే పండితులతో వాదం చేయడం ఆరంభించారు. అపుడు శ్రీరంగంలో ఉండే పెద్దలు శ్రీదేశికులను ఈ వాదానికి ఆహ్వానించి, వారి ద్వారా వాదాన్ని నిర్వహించడం మంచిది అని భావించి, శ్రీదేశికులకు లేఖ వ్రాశారు. దేశికులు కూడా శ్రీరంగనాథుని సేవించాలి– అని చాలా కాలంగా ఆసక్తిని కలిగి ఉన్న తమకు ఇది అతడే చేసిన అనుగ్రహం అని తలచి. వెంటనే శ్రీరంగానికి వెళ్లారు. క్రమాన్ని అనుసరించి అక్కడ ఉండే అన్ని దేవాలయాలను సేవించి శ్రీరంగనాయకిని, శ్రీరంగనాథుని దర్శించి, మంగళాశాసనం చేసి, వాదం జరిగే చోటుకు వెళ్లారు. అక్కడ ఉండే పెద్దలు దేశికుల రాకను చూచి, చాలా ఆనందాన్ని పొందారు. తరువాత, దేశికులు అక్కడ ఉండే ప్రతివాదులతో వాదం చేసి, వారిని జయించి గెలిచారు. ఈ సందర్భాన్ని చూసిన పెద్దలు చాలా ఆనందంతో శ్రీదేశికుల విషయంలో గొప్ప గౌరవాన్ని కలిగినవారయ్యారు.

## 17)సిద్ధాంత ప్రచారం

శ్రీదేశికుల గొప్పతనాన్ని, ఆత్మ గుణాలను చూసినవారు వారి శ్రీచరణాల సన్నిధికి వచ్చి, వారిని ఆశ్రయించారు. దేశికులు వారికి ఉభయవేదాంత కాలక్షేపాన్ని అనుగ్రహించి, శ్రీరంగనాథుని నిరంతరంగా సేవిస్తూ ఆనందించారు. భగవద్రామానుజ సిద్ధాంతాన్ని దేశంలో అంతటా వ్యాపింపచేసి, చేతనులను తరింప చేయడమే తమకు

ముఖ్యమైన కర్తవ్యంగా భావించిన దేశికులు తమ ఉద్దేశం నెరవేరడానికి తగిన చోటు శ్రీరంగమే కావడాన్ని బట్టి అక్కడనే చిరకాలం వాసం చేశారు.

## 18)గ్రంథనిర్మాణం

ఈ ఉభయ వేదాంత సంప్రదాయం తమ కాలంలో ఉండే వారికి మాత్రమే ఉపయోగపడడం కాకుండా, తమకు తరువాతవారు కూడా కాలంలో కూడా చక్కగా ప్రచారం పొందడానికి గ్రంథాల ద్వారా సహాయం చేయడమే తగిన మార్గం అని శ్రీదేశికులు భావించారు. భగవద్రామానుజులు వీరికి కలలో సాక్షాత్కరించి ఉభయ వేదాంత మార్గాన్ని రక్షించడం కోసం అనేక దివ్య సూక్తులను అనుగ్రహించమని ఆజ్ఞాపించినందున తాము మనసులో తలచిన భావం, వారి మనసులో మరింత దృఢపడింది. తరువాత, దేశికులు భగవద్ధ్యాన సోపానం, దశావతార స్తోత్రం మొదలైన స్తోత్రాలను, సర్వార్థసిద్ధిలో కూడిన తత్వముక్తాకలాపం, న్యాయపరిశుద్ధి, న్యాయ సిద్ధాంజనం, సేశ్వర మీమాంస, తత్వటీక శతదూషనణి మొదలైన అనేక వేదాంత గ్రంథాలను అనుగ్రహించారు.

## 19)బిరుదులను పొందడం

ఈ విధంగా వైలక్షణ్యాన్ని కలిగిన దేశికుల ప్రవచన చాతుర్యాన్ని, పలు గ్రంథాలను రచించి లోకానికి చేసిన మహోపకారాన్ని చూచి చాలా ఆనందించిన శ్రీరంగనాథుడు వీరికి

వేదాంతాచార్యులు అనే బిరుదాన్ని ఇచ్చాడు. శ్రీరంగనాయకి కూడా దేశికులు సకల కళలలోనూ విశేషమైన జ్ఞానాన్ని కలిగినవారై ప్రకాశించడానికి గమనించి ఆనందించి, వారికి సర్వతంత్ర స్వతంత్రులు అనే బిరుదును ఇచ్చినది. ఈ విధంగా దివ్య దంపతుల చేత బిరుదులను పొంది, గొప్ప గౌరవాన్ని పొందిన దేశికులకు అక్కడ ఉండే మహావిద్వాంసులు సభ చేసి, కవితార్కికసింహం అనే బిరుదును సమర్పించి తాము కృతార్థులయ్యారు. ఈ విధంగా అనేక విధాలుగా కీర్తింపబడిన దేశికులు శ్రీరంగనాథుని మనసారా, కళ్ళారా సేవిస్తూ, చిరకాలం శ్రీరంగంలోనే నివసించారు.

## 20)ఒక విద్వాంసుని, కవిని జయించడం

ఒక సందర్భంలో కృష్ణమిశ్రులు అనే ఒక విద్వాంసుడు దేశికుల దగ్గరకు వచ్చి వాదించాడు. దేశికులు తమ మేధావిలాసంతో అతనిని జయించగా, అతడు దేశికుల గొప్పతనాన్ని చూచి ఆశ్చర్యపడి వారిని సేవించి వెళ్ళిపోయాడు. అప్పుడు అవతరించినదే సంకల్ప సూర్యోదయం అనే అద్భుతమైన నాటక గ్రంథం అని తెలుస్తున్నది.

తరువాత, ఒక సందర్భంలో, డిండిమ భట్టు అనే మహాకవి తాను రచించిన కావ్యాలను తీసుకుని వచ్చి దేశికులకు చూపించి, " ఇటువంటి కవిత్వాన్ని చెప్పే సామర్థ్యం మీకు ఉన్నదా?" అనే భావంతో ప్రశ్నించాడు. అప్పుడు దేశికులు యాదవాభ్యుదయం అనే మహాకావ్యాన్ని అతివేగంగా రచించి అతనికి చూపించగా, ఆ కవి కూడా

స్వామి కవిత్వాన్ని చూచి, చాలా ఆశ్చర్యపడి, సిగ్గుపడి వారికి క్షమాపణ చెప్పి, వారి గొప్పతనాన్ని అంతటా ప్రచారం చేశాడు.

## 21)దక్షిణదేశయాత్ర

ఈ విధంగా గొప్ప వైభవంతో శ్రీరంగం చిరకాలం దేశికులు వేంచేసి ఉన్నప్పుడు, దక్షిణ దేశంలో ఉండే దివ్యదేశాలను సేవించాలని వారు అభిప్రాయపడ్డారు. అక్కడనుండి బయలుదేరి క్రమంగా తిరుమాలిరుమ్ శోలై, తిరుక్కుఱుంగుడి, శిరీవరమంగై మొదలైన దివ్యదేశాలను సేవించి, శ్రీవిల్లిపుత్తూరులో గోదాదేవిని సేవించారు. అప్పుడు గోదాస్తుతిని అనుగ్రహించారు. తరువాత తిరుప్పుల్లాణి మొదలైన దివ్య క్షేత్రాలను సేవించి, తిరుక్కురుకూరులో నమ్మాళ్వార్లను దర్శనం చేసుకుని, తిరువనంతపురం మొదలైన కేరళ దివ్య క్షేత్రాలను, ఆ తరువాత చోళమండలంలో ఉండే దివ్యదేశాలను సేవించి, అక్కడే మూర్తులకు మంగళాశాసనం చేసి తిరువహీంద్రపురానికి వచ్చి, తమ కర్తవ్యాలను అనుష్ఠిస్తూ వచ్చారు.

## 22)బావిని తవ్వడం

తిరువహీంద్రపురంలో దేశికులు దేవనాయక స్వామిని సేవిస్తూ కాలాన్ని గడిపే సమయంలో, ఒకనాడు ఒక కుమ్మరివాడు, అన్ని కళలలోనూ దేశికులు సామర్థ్యాన్ని కలిగినవారు అని విని, దానిని పరీక్షించడం కోసం వచ్చాడు. లక్ష్మీదేవి అనుగ్రహించిన బిరుదు విషయంలో లోకులు ఎవ్వరూ సందేహపడనప్పటికీ, దానిని

నిరూపించుకోవలసినదిగా దేశికులతో ఆ కుమ్మరివాడు అనగా, దానికి దేశికులు అంగీకరించారు. తాను ఇచ్చే రాళ్లతో ఒక బావిని తవ్వి కట్టవలసినదని అతడు కోరాడు. ఆ పరీక్షకు దేశికులు కూడా అంగీకరించారు. ఆ కుమ్మరివాడు ఇచ్చిన రాళ్ళను తీసుకొని తమ సాధారణ సామర్థ్యంతో దేశికులు చాలా అందమైన ఒక బావిని తవ్వి ఆ రాళ్ళతో దానిని కట్టారు. ఈ సంగతిని గమనించిన కుమ్మరివాడు చాలా ఆశ్చర్యపడి, తన మనసులో ఉండే సందేహాన్ని, గర్వాన్ని విడచి పెట్టాడు. వారిని సేవించి వెళ్ళిపోయాడు. ఈనాటికీ ఆ బావి, దేశికుల తిరుమేని, తిరువడుల సంబంధాన్ని కలిగిన గృహం ఈనాటికి అందరికీ సాక్షాత్కరిస్తున్నవి.

## 23)పరమతభంగ గ్రంథ రచన

ఒకానొక సమయంలో త్రైమాసం ఐదవ నాడు దైవనాయక స్వామి పణ్ణా నది తీరానికి వేంచేయగా, అక్కడ ఆ స్వామికి గొప్ప ఉత్సవం జరిగింది. దేశికులు కూడా దానిని సేవించడం కోసం అక్కడకు వెళ్లారు. అప్పుడు ఆ చోటుకు దగ్గరలో ఉండే పలు గ్రామాలలో నివసించే ద్రావిడ పండితులైన జైనులు శ్రీదేశికుల గొప్పతనాన్ని విని సహించనివారు కనుక, వారిని ఏ విధంగానైనా జయించాలని భావించారు. కేవలం తాము మాత్రమే వాదించి దేశికులను జయించడం సాధ్యం కాని పని– అని గుర్తించి, అక్కడ ఉండే అనేక మతాలకు చెందిన పండితులను సహాయంగా చేసుకుని దేశికులతో వాదానికి దిగారు. దేశికులు కూడా దైవనాయక స్వామి సమక్షంలోనే ఆ ప్రతివాదులను అందరిని వాదనలో

జయించారు. వారు అందరూ వాదించిన వాదాలను, వాటిని ఖండిస్తూ, తాము చెప్పిన సమాధాన ప్రకారాలను కూర్చి, పరమత భంగం అనే ఒక గొప్ప రహస్య గ్రంథాన్ని రచించారు– అని సంప్రదాయపరంపరలో చెప్పబడుతున్నది.

## 24)కాంచీపురంలో పాములవానిని జయించడం

కాంచీపురంలో ఉండే శిష్యులు చాలామంది శ్రీదేశికుల విశ్లేషాన్ని సహించలేనివారై, తిరువహీంద్రపురానికి వచ్చి, దేశికులను కాంచీ పురానికి తిరిగి రమ్మని ప్రార్థించారు. "ఇది కూడా వరదరాజస్వామి ఆజ్ఞయే" అని భావించి దైవనాయకస్వామి దగ్గర అనుమతిని పొంది కాంచీపురానికి దేశికులు వచ్చి, వరదరాజస్వామికి మంగళాశాసనం చేశారు. అక్కడ సిద్ధాంత ప్రవచనాన్ని చేస్తూ కాలాన్ని గడపసాగారు.

ఈ విధంగా జరుగుతూ ఉండగా, ఒకసారి పాములను పట్టి ఆడించేవాడు ఒకడు స్వామి దగ్గరకు వచ్చి, "నా దగ్గర ఉండే పాములను మీకు సాధ్యమైతే బంధించి చూడండి! " అని అన్నాడు. ఆ విధంగా అంటూ తన బుట్టలో నుండి కొన్ని పాములను బయటకు తీసి విడచి పెట్టాడు. అప్పుడు దేశికులు కొన్ని గీతలను భూమిపై గీయగా, ఆ పాములు ఆ గీతలను దాటి ముందుకు రాలేకపోయాయి. వాటిలో ఒక క్రూరమైన సర్పం మాత్రం ఆ గీతలను దాటి స్వామి దగ్గరకు వచ్చింది. అప్పుడు దేశికులు గరుడ మంత్రాన్ని ఉచ్చరించారు. వెంటనే ఆకాశం నుండి గరుడుడు వేగంగా వచ్చి అన్ని సర్పాలను పట్టుకొని ఎగిరి

వెళ్లిపోయాడు. పాములవాడు తనకు అపజయం సంభవించడాన్ని మాత్రమేకాక తనకు జీవనోపాయంగా ఉండే సర్పాలు అన్నీ కోల్పోవడాన్ని గమనించి చాలా భయంతో దేసికుల దగ్గరకు వచ్చి ప్రార్థించి, తనకు మళ్లీ ఆ సర్పాలు లభించేటట్లు చేయమని కోరాడు. అప్పుడు దేశికులు గరుడ దండకం అనే స్తోత్రాన్ని ఆశువుగా అనుగ్రహించారు. వెంటన గరుడుడు పాములను అన్నిటినీ తీసుకుని వచ్చి విడచి పెట్టాడు, దానిని చూసి ఒ పాములవాడు చాలా సంతోషించి దేశికులకు నమస్కరించి, అన్ని కళలలోనూ సామర్థ్యం వారికి మాత్రమే ఉన్నది అని కీర్తించి, పాములను తీసుకొని వెళ్ళిపోయాడు.

## 25)వివాదంలో మద్యస్థులుగా ఉండడం

శ్రీదేశికుల కీర్తి, దేశంలో అంతటా వ్యాపించింది. ఆ కాలంలో విజయనగర సంస్థానంలో ప్రభువు సభలో గొప్ప పదవిలో ఉండే అద్వైత మతానికి చెందిన విద్యారణ్యులకు, ద్వైతమత విద్వాంసులలో ప్రధానులు, గొప్ప వాదనైపుణ్యాన్ని కలిగిన అక్షోభ్యమునికి మధ్య వాదం ఒక్కసారి ఏర్పడింది. అప్పుడు దేశికులే ఆ వాదంలో మద్యస్థులుగా ఉండి తీర్మానం చేయడానికి సమర్థులు అని వారిద్దరూ భావించి, తమ వాద విషయాలను దేశికుల దగ్గరకు రాసి పంపించి, ప్రామాణికమైన పక్షాన్ని నిర్ణయించి తెలియజేయాలి— అని ప్రార్థించారు. దేశికులు కూడా వాటిని గమనించి, అక్షోభ్యముని పక్షమే వీలైనంతవరకు ప్రామాణికతను కలిగినది— అని సమాధానాన్ని రాసి పంపించారు. అంతటిలో వివాదం తీరింది.

## 26)వరదరాజస్వామి ఉత్సవాన్ని నిర్వహించడం

వరదరాజస్వామి ఉత్సవ కాలంలో తిరువీధి ఉత్సవం జరిగేటప్పుడు, ఆ స్వామికి ముందు దివ్య ప్రబంధాన్ని అనుసంధించడం శాస్త్రవిరుద్ధమని ఇతర మతాలకు చెందినవారు కొందరు ఆక్షేపించారు. శ్రీదేశికులు అప్పుడు వారితో వాదించి, దివ్యప్రబంధం పరమవైదికం అనే విషయాన్ని స్థాపించి, వారిని జయించి, ఉత్సవాన్ని ఏ ఆటంకం లేకుండా జరిపించారు. వరదరాజస్వామి చాలా సంతోషించి తన తిరుచ్చిన్నాలు రెండిటిలో ఒక తిరుచ్చిన్నాన్ని శ్రీదేశికులకు అనుగ్రహించాడు. ఈ వృత్తాంతాన్ని అనుసరించే ఈ నాటికీ వరదరాజస్వామికి ఒకటే తిరుచ్చిన్నం ఊదబడుతున్నది అని పెద్దలు అంటారు.

## 27)యాత్రలో హయగ్రీవ స్వామి దివ్యలీల

ఈ విధంగా కాంచీపురంలో చాలా దినాలు నివసించిన తరువాత, మళ్ళీ శ్రీరంగనాథుని సేవించాలి అని దేశికులు అభిప్రాయపడ్డారు. అప్పుడు కాంచీపురం నుండి బయలుదేరి, దేశికులు తిరుక్కోవలూర్ దివ్య క్షేత్ర మార్గం ద్వారా ప్రయాణం చేస్తూ ఉండగా, ఒకనాటి రాత్రి, వేరు ఏ చోటు లభించనందున, సముద్ర వ్యాపారం చేసే ఒక వైశ్యుని గృహం దగ్గరగా తమ నిత్యారాధన అర్చామూర్తితో పాటు వారు విడిది చేయడం తటస్థించింది. ఆనాటి రాత్రి దేశికులు శ్రీహయగ్రీవునకు శుద్ధమైన తీర్థాన్ని మాత్రం నివేదనం చేసి, తాము ఉపవాసం చేశారు. ఆ రాత్రి ఆ

వైశ్యుని ఇంటిలోనికి వేగంగా ఒక తెల్లని గుర్రం ప్రవేశించి, గిడ్డంగిలో ఉండే ధాన్యాన్ని మేసినట్లు, దానిని అదిలించడం సాధ్యం కానట్లు ఆ వైశ్యుడు దేశికులకు తెలియజేశాడు. వారు కూడా ఆ తెల్లని గుర్రం రూపంలో వచ్చినది హయగ్రీవుడే అని, అది అంతా హయగ్రీవ స్వామి చేసిన దివ్య లీల— అని నిశ్చయించుకొని, ఆ వైశ్యుని కొంచెం పాలను తెమ్మని చెప్పి, దానిని అశ్వరూపంలో సాక్షాత్కరించిన ఆ హయగ్రీవస్వామికి నివేదనం చేశారు. దానిని స్వీకరించిన ఆ గుర్రం అదృశ్యమైనది. ఈ విధంగా దేశికుల మహిమను చూసిన వైశ్యుడు వారి విషయంలో చాలా భక్తి ప్రపత్తులను కలిగినవాడు అయ్యాడు. ఈ సందర్భంవల్ల అతనికి చాలా ధనప్రాప్తి కూడా లభించింది.

## 28)శ్రీపాదుకా సహస్రాన్ని రచించడం

శ్రీదేశికులు శ్రీ రంగాన్ని చేరి, శ్రీరంగనాథుని, శ్రీరంగ నాయకిని తనివితీరా దర్శించి మంగళాశాసనం చేసి, పూర్వంవలెనే సిద్ధాంత ప్రవర్తనాన్ని చేస్తూ ఉన్నారు. వారి విశేష జ్ఞానాన్ని మేధావైశద్యాన్ని, శ్రీరంగనాథుని శ్రీచరణాలలో వారికి ఉండే అభినివేశాన్ని చూచిన పలువురు పెద్దలు, వారిని ద్వారా శ్రీ రంగనాథుని విషయంలో ఒక స్తోత్రరూపమైన ఉత్తమ కావ్యం అవతరించాలి అని ఆశించారు. అందుకోసం వారు ఒక సభను చేసి, అందరూ ఒకటిగా చేరి స్వామిని ప్రార్థించారు. దేశికులు కూడా అది భగవంతుని ఆజ్ఞ అని భావించి దాస్యంలో ఉత్తమ దశలో నిలచినవారై, శ్రీరంగనాథుని శ్రీ చరణాలను రక్షిస్తూ ఉండే రెండు పాదుకలను విషయంగా చేసుకొని,

నమ్మాళ్వారులకు పాదుకలకు ఐక్యాన్ని తెలియజేస్తూ, "నమ్మాళ్వారుల వాక్కునుండి తిరువాయ్ మొళి ప్రబంధం అవతరించినట్లుగానే, ఇప్పుడు తమ వాక్కునుండి వచ్చే సహస్రం పాదుకల ధ్వని కాగలదు" అని పలికి, అనేక వృత్తాలలో, అనేక చిత్రబంధ రీతులను ప్రదర్శిస్తూ, వేయి శ్లోకాలను కలిగిన పాదుకా సహస్రం అనే అత్యద్భుతమైన స్తోత్రాన్ని అనుగ్రహించారు.

## 29)బ్రహ్మచారికి ధనాన్ని అనుగ్రహించడం

సాత్వికుడైన ఒక బ్రహ్మచారి తన వివాహానికి కావలసిన ధనం లేకుండా ఉన్నందున బాధపడి, తనకు ధనం లభించేటట్లు అనుగ్రహించవలసినదిగా దేశికులను ప్రార్థించాడు. దేశికులు కూడా అతని కోరికను పూర్తిచేయాలని అనుకొని, శ్రీరంగనాయకి సన్నిధికి అతనిని కూడా తీసుకొని పోయి, ఆ దేవేరి ముందు శ్రీస్తుతి అనే స్తోత్రాన్ని అనుగ్రహించగా, ఆ శ్రీ రంగనాయకి స్వర్ణనాణాలను వర్షించినది. ఆ ధనాన్ని అంతటిని సేకరించి తీసికొమ్మని బ్రహ్మచారిని దేశికులు నియమించగా, అతడు కూడా ఆశ్చర్యంతో నిండిన మనస్సుతో ఆధనాన్ని అంతటినీ తీసుకొని దేశికులకు నమస్కరించి వెళ్లిపోయాడు. ఆ నాణాలను కంటితో కూడా చూడని స్వామి వైరాగ్యాన్ని అక్కడ ఉండేవారు చాలా పొగిడారు.

## 30) "శ్రీమాన్ వేంకట…" అనే తనియన్ శ్లోకం అవతరించడం

ఈ విధంగా గొప్ప వైభవంతో దేశికులు శ్రీరంగంలో సంప్రదాయ ప్రవర్తనం చేస్తున్నారు. అప్పుడు వారి కుమారులైన వరదాచార్యులవారు "శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ, వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది"అనే తనియన్ శ్లోకాన్ని శ్రీదేశికుల సన్నిధిలో విజ్ఞాపన చేశారు. అప్పుడు, అక్కడ ఉన్న పలువురు పెద్దలు ఆ శ్లోకంలోని అర్థపుష్టిని, స్వామి ప్రభావాన్ని తెలియజేసే గొప్పతనాన్ని గమనించి, ఇది సంస్కృత సూక్తులకు అన్నిటికీ తనియన్ గా ఉండాలి – అని ప్రార్థించగా, దేశికులు కూడా దానికి అంగీకరించారు.

## 31)ఒక పెద్దలు చేసిన అపచారం తీరిపోవడం

కందాడై లక్ష్మణాచార్యులవారు అనే ఒక స్వామి శ్రీదేశికుల విషయంలో ఒక అపచారం చేయడం సంభవించింది. దాని వల్ల వారు ఒక తీరని వ్యాధిని పొంది, చాలా బాధపడవలసి వచ్చింది. వారు అపుడు పశ్చాత్తాపంతో దేశికుల దగ్గరకు వచ్చి, వారి శ్రీపాద తీర్థాన్ని స్వీకరించిన తరువాతనే వారికి ఆ వ్యాధి తీరింది. అంత మాత్రమే కాక, అంతవరకు సంతతి లేని వారికి ఒక పుత్రుడు కూడా కలిగాడు. ఈ విధంగా శ్రీపాదతీర్థ మహిమ వల్ల పుట్టిన ఆ పుత్రునకు తీర్థప్పిళ్లై అనే పేరును వారు పెట్టారు.

## 32)సత్యమంగళానికి రావడం

ఆ సందర్భం వల్ల దేశికులు తమ మనసులో కొంత విచారాన్ని పొందారు. కొన్నాళ్లు ఏకాంతంగా వాసం చేయాలని అనుకొని, తమ ధర్మపత్నితో, కుమారునితో, పాటు కొంతమంది శిష్యులతో పాటు సత్యమంగళం అనే చోటుకు వచ్చి, అక్కడ అనుష్ఠానంలో ఏ విధమైన లోటు లేకుండా, శిష్యులకు గ్రంథ ప్రవచనాన్ని చేస్తూ కాలాన్ని గడిపారు.

## 33) యవనుల ఉపద్రవం

కొంతకాలం గడిచిన తరువాత శ్రీదేశికులు శ్రీరంగానికి మళ్లీ తిరిగి వచ్చారు. అప్పుడు ఆ సమయంలో అక్కడ యవనులు పెద్దసేనను సమీకరించుకొని శ్రీరంగంపై దండెత్తి వచ్చి, హిందూమత ప్రభువులకు, వారి నివాసాలకు, ఆలయాలకు అన్నిటికీ చాలా హానిని కలిగించారు. అప్పుడు, అక్కడ ఉండే సుదర్శన భట్టర్ మొదలైన పెద్దలు శ్రీరంగనాథుని ఉత్సవమూర్తి తిరుమేనికి హాని వస్తుందేమో! అని భయపడి, మూలబేరాలను రాళ్లతో అడ్డుగా గోడ కట్టడం ద్వారా మరగుపరచి, ఉత్సవ విగ్రహాలను పెట్టెలలో పెట్టుకొని అరణ్యమార్గం ద్వారా ఉత్తరదేశ ప్రాంతానికి వెళ్ళిపోయారు. దీనిని తెలిసికొన్న దేశికులు కూడా వారిని వెంబడించారు. శ్రీరంగనాథుడు మొదలైనవారి ఉత్సవ విగ్రహాలను పెట్టిన పెట్టెలను తిరుమలకు తీసుకుని పోయి, రహస్యంగా అక్కడ నిలిపి సంగ్రహంగా ఆరాధనం చేసినట్లు చరిత్ర చెబుతున్నది.

## 34)దేశికులు శ్రుతప్రకాశికా వ్యాఖ్యానాన్ని రక్షించడం

ఆ సమయంలో సుదర్శన భట్టర్ తాము శ్రీభాష్యానికి వ్యాఖ్యానంగా వ్రాసిన శ్రుతప్రకాశిక అనే అరుదైన గ్రంథాన్ని, బాల్యంలో ఉండే ఇద్దరు కుమారులను శ్రీదేశికులకు అప్పగించి, వారిని రక్షించమని అడిగారు. చాలా శ్రమతో ఆ ఆపద నుండి తప్పుకొని బయటపడి దేశికులు శ్రుతప్రకాశికా గ్రంథంతోను, ఆ ఇద్దరూ బాలురతోను సత్యమంగళానికి వెళ్లారు. ఆ ఇద్దరు పిల్లలకు దేశికులు అక్కడ ఉపనయనం మొదలైన సంస్కారాలను చేసి, విద్యాభ్యాసాన్ని కూడా చేయించారు. శ్రుతప్రకాశికను రక్షించి, దానిని తమ శిష్యులకు ప్రవచనం చేస్తూ వచ్చారు. ఆ విధంగా శ్రీదేశికులు ఆ గ్రంథాన్ని రక్షించి ఉండకపోతే, ఈనాడు శ్రీరామానుజులకు అభిమతమైన శ్రీ భాష్యార్థాలను మనం తెలుసుకోవడం ఏ విధంగా సాధ్యమై ఉంటుంది?

## 35)తిరునారాయణపురాన్ని చేరడం

శ్రీదేశికులు సత్యమంగళంలో కొంచెం కాలం మాత్రం ఉండి, తరువాత యాత్రగా బయలుదేరి తిరునారాయణాపురాన్ని చేరారు. అక్కడ శెల్వప్పిళ్ళై అనే ఉత్సవమూర్తిని, భగవద్రామానుజులను సేవించి, మంగళాశాసనం చేసి, ఆ రామానుజుల విషయంగా యతిరాజసప్తతి అనే స్తోత్రాన్ని అనుగ్రహించారు. శ్రీరంగనాథుని విశ్లేషాన్ని సహించలేక దేశికులు మనస్సులో చాలా సంతాపాన్ని పొందినవారై, మళ్ళీ తిరిగి చక్కని ప్రశాంతత అక్కడ ఏర్పడి, ఆ స్వామికి పూర్వంవలెనే ఆరాధన, ఉత్సవాలు మొదలైనవి జరగాలని

కోరుకుంటూ, శ్రీరంగనాథుని ప్రార్థిస్తూ అభీతిస్తవం అనే ఒక స్తోత్రాన్ని రచించారు. దానినే మాటిమాటికి ఆవృత్తి చేసుకొంటూ ఉన్నారు.

## 36)శ్రీరామానుజదయాపాత్ర తనియన్ శ్లోకం అవతరించడం

శ్రీదేశికుల శిష్యులలో ముఖ్యులైన పేరరుళాళర్ అనేవారు సన్యాసాశ్రమాన్ని స్వీకరించి బ్రహ్మతంత్ర స్వతంత్రులు అనే పేరుతో స్వామి చరణసన్నిధిలోనే ఉండి, గ్రంథకాలక్షేప గోష్ఠిలో అన్వయిస్తూ ఉన్నారు. దేశికులు ఆఱాయిరప్పడి వ్యాఖ్యానానికి వివరణ రూపంగా తాము అనుగ్రహించిన నిగమ పరిమళం అనే దివ్యసూక్తితో శిష్యులకు ప్రవచనం చేశారు. అప్పుడు బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి శ్రీదేశికుల విషయంగా "రామానుజదయాపాత్రమ్" అనేక తనియన్ శ్లోకాన్ని రచించి స్వామి సన్నిధిలో విజ్ఞాపన చేశారు. ఈ తనియన్ శ్లోకాన్ని దివ్య ప్రబంధాలు మొదలైన ద్రవిడ సూక్తులకు ముందు అనుసంధించాలని దేశికులు అనుగ్రహించారు. బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి, శ్రీదేశికుల కుమారులైన వరదాచార్య స్వామితో సంబంధం తమకు కలగాలని కోరి, శ్రీదేశికుల ఆజ్ఞను పొంది, భగవద్విషయాన్ని మాత్రం వరదాచార్యులవారి సన్నిధిలో కాలక్షేపాన్ని చేసి, వారి విషయంగా "శ్రీమల్లక్ష్మణ యోగీంద్ర సిద్ధాంత విజయధ్వజమ్…" అనే తనియన్ శ్లోకాన్ని రచించి, వారికి సమర్పించారు. "శిరొన్ఱు తూప్పుల్" అనే తనియన్ పాశురాన్ని తమ ద్రావిడ, మణిప్రవాళ సూక్తులకు ముందు అనుసంధించే క్రమాన్ని శ్రీదేశికులు ఏర్పాటు చేశారు.

## 37)శ్రీరంగ క్షేత్రంలో యనసుల ఉపద్రవం తీరడం

అప్పుడు చెంజి అనే చోట రాజ్యాన్ని చేస్తూ వచ్చిన గోపనార్యుడు అనే ప్రభువు గొప్ప సేనను సమీకరించుకొని దండెత్తిపోయి, ఆలయాలకు ఉపద్రవాలను కలిగించిన యవనులను అందరినీ జయించి, శ్రీరంగంలో మళ్లీ ప్రశాంతత ఏర్పడేటట్లు చేశాడు. ఇక శ్రీ రంగనాథుని ఉత్సవమూర్తిని శ్రీరంగానికి తీసుకొని వచ్చి నిలిపి, సన్నిధి కైంకర్యాలను పూర్వం వలెనే జరపడానికి నిశ్చయించుకున్నాడు. సకల పరివారాలతో తిరుమలకు వెళ్లి, అక్కడ పూర్వం దాచి పెట్టిన దివ్యమంగళ విగ్రహాలను సకలవైభవాలతో తీసుకొని వచ్చి, చెంజిలో కొంతకాలం పెట్టి, తిరువారాధనాన్ని జరిపించాడు. తరువాత ఆ దివ్యమూర్తులను శ్రీరంగానికి తీసుకుని వచ్చి, పునః ప్రతిష్ఠ చేయించి, నిత్యారాధనం మొదలైనవానిని యథాపూర్వంగా జరిగేటట్లు చేశాడు.

## 38)దేశికులు శ్రీరంగానికి తిరిగి రావడం

శ్రీరంగ క్షేత్రంలో యవనుల కారణంగా ఏర్పడిన ఉపద్రవం తీరి ప్రశాంతత కలిగేటట్లు ఏర్పాటు చేసి, మళ్లీ శ్రీరంగనాథునకు యథాపూర్వంగా ఆరాధన ఏ లోటు లేకుండా గోపనార్యుడు నిర్వహిస్తున్న విషయాన్ని దేశికులు తెలుసుకొని మనసులో చాలా సంతోషించారు. తమ ధర్మపత్నితో, కుమారనితో, శిష్యులు అందరితో కలసి శ్రీరంగానికి తిరిగి వచ్చారు. చాలా కాలంగా శ్రీరంగనాథుని

సేవించలేని కొరత అంతా తీరేటట్లుగా పరిపూర్ణంగా కళ్ళారా, మనసారా శ్రీరంగనాథుని దర్శించి, ఆ స్వామికి మంగళాశాసనం చేసి, ఆనందించారు. తరువాత అక్కడే సిద్ధాంత ప్రవచనాన్ని చేస్తూ ఉన్నారు.

## 39)అధ్యయనోత్సవాన్ని నిర్వహించడం

శ్రీరంగంలో మార్గళి మాసంలో అధ్యయనోత్సవం చేయవలసి వచ్చింది. కొన్ని సంవత్సరాలుగా అక్కడ ఆ ఉత్సవం జరగకుండా నిలచిపోయినందున, మళ్లీ తిరిగి దానిని ఆరంభించేటప్పుడు ఏదైనా ఒక ఆటంకం రావడం సహజమే. ఐపుడు అన్యమతాలవారు కొందరు అక్కడకు వచ్చి, ఆ ఉత్సవం స్వామికి నిర్వహించడం తగదని, అనేక వర్ణాలలో పుట్టిన ఆళ్వారుల విగ్రహాల ప్రతిష్ఠ వారి ఆరాధనం, వారి ఉత్సవం మొదలైనవానిని చేయడం అశాస్త్రీయం అని, ఆ ఉత్సవం వారికి సంబంధించినది కనుక జరపడం తగదని వాదించడం ఆరంభించారు. అప్పుడు వారిని అందరిని దేశికులు వాదంలో జయించి, అళ్వార్లకు చేసే ఆరాధనలు అన్నీ శాస్త్రీయమైనవే అని స్థాపించి, అధ్యయనోత్సవాన్ని మహా వైభవంగా జరిగే ఏర్పాట్లను చేశారు. ఈ విధంగా మాటిమాటికి ఈ కైంకర్యానికి ఆటంకం రావడానికి చూచి, ఈ ఉత్సవం ప్రకారం స్థిరంగా నిలచి ఉండేటట్లు రాతి ఫలకం పైన చెక్కించారు. దీనివల్ల మనస్సులో చాలా ఆనందాన్ని పొందిన శ్రీరంగనాథుడు దేశికుల గొప్పతనాన్ని తెలియజేసే "రామానుజ దయాపాత్రం" అనే తనియన్ శ్లోకాన్ని ఆలయాలలో, గృహాలలో ప్రబంధ

గోష్ఠి ఆరంభించేటప్పుడు మొదట తప్పక అనుసంధింపబడాలి అనే క్రమాన్ని నియమించాడు.

## 40)శిల్పిని జయించడం

అన్ని కళలలోను దేశికులకు కల ప్రావీణ్యాన్ని విని, ఒక శిల్పి వారి శక్తి ఎటువంటిదో పరీక్షించాలని అనుకున్నాడు. స్వామి దగ్గరకు వచ్చి, తాను ఒక పీఠం చెక్కుతానని, స్వామి తమ రూపాన్ని ఆ పీఠంలో అమిరేటట్లు విగ్రహంగా చెక్కాలని ఒక సంకేతాన్ని ఏర్పాటు చేశాడు. అందుకు దేశికులు అంగీకరించారు. శిల్పి చెప్పిన విధంగానే అతడు పీఠాన్ని చక్కగా దానికి సరిపోయేటట్లు తమ విగ్రహాన్ని దేశికులు చెక్కారు. అప్పుడు శిల్పి ఆ విగ్రహంలోని సన్నివేశాన్ని, అందాన్ని చూచి ఆశ్చర్యపడి, తాను చెక్కిన పీఠంలో ఆ విగ్రహాన్ని కూర్చడానికి ప్రయత్నం చేశాడు. కానీ ఆ పీఠంలో ఆ విగ్రహం ఇముడనందున, తన ఉలితో ఆ విగ్రహంలోని ఒక భాగాన్ని చెక్కగా, వెంటనే దేశికుల శరీరం నుండి రక్తం స్రవించింది. దీనిని గమనించిన శిల్పి చాలా బాధపడి దోషం తన పీఠంలోనే ఉన్నది అని గ్రహించి, స్వామి దగ్గర అపరాధక్షమాపణను ప్రార్థించి వెళ్ళిపోయాడు. తరువాత దేశికులు ఆ పీఠాన్ని సరి చేసి, అందులో విగ్రహం కుదిరేటట్లు చేసి తమ అసాధారణమైన నైపుణ్యాన్ని ప్రదర్శించారు. ఆ విగ్రహం చాలా అందంగా కుదిరింది. ఒక చేతిలో శ్రీకోశం, ఇంకొక చేతిలో జ్ఞానముద్ర అనే వీటితో, మేలిమి బంగారు ఛాయతో ప్రకాశించి వెలిగే ఆ విగ్రహాన్ని తమ తిరుమేనితో ఆలింగనం చేసికొని, తమ కుమారులైన వరదాచార్యులవారికి దానిని ఇచ్చారు.

దేశికులకు తరువాత, వరదాచార్యులవారు ఆ విగ్రహాన్ని దేశికులు చిరకాలం వాసం చేసిన తిరువహీంద్రపురంలో దైవనాయక స్వామి చరణసన్నిధి సమీపంలో ప్రతిష్ఠ చేసి, దేశికులు అర్చారూపంలో కూడా ఎల్లప్పుడూ దైవనాయక స్వామిని సేవించి ఆనందించేటట్లు చేశారు. ఆ రూపాన్ని మనం చూస్తే, అది దేశికులు నిర్మించిన విగ్రహం అనే విషయం వెంటనే స్పష్టంగా మనకు తెలుస్తుంది.

## 41)శ్రీమద్రహస్యత్రయ సారం అవతరించడం

దేశికులు అసంఖ్యాకంగా గ్రంథాలను రచించినప్పటికీ, వారి మనస్సులో ఒక కొరత మాత్రం నిలిచిపోయింది. అది తత్త్వ హిత పురుషార్థాలు అనే వీటిని చక్కగా వివరించేది, తిరుమంత్రం, ద్వయం, చరమశ్లోకం—అనే మూడు రహస్యాల అర్థవిశేషాలను విస్తృతంగా తెలియజేసేది, ఇంకా చేతనులు గ్రహించవలసిన సకలవిషయాలను బోధించేదిగా ఉండే ఒక మణిప్రవాళ రహస్య గ్రంథం అంతవరకు రచించక పోవడమే ఆ కొరత. దేశికులు తమ చివరి దశలో అటువంటి సాటి లేని గ్రంథమైన శ్రీమద్రహస్యత్రయసారం అనే గ్రంథాన్ని అనుగ్రహించి, మనకు ఇంత అని చెప్పడానికి సాధ్యం కానంతటి ఉపకారాన్ని చేశారు. దానిపై వచ్చే సందేహాలకు సమాధానాన్ని చెప్పే రీతిలో విరోధ పరిహారం అనే ఇంకొక అద్భుతమైన రహస్య గ్రంథాన్ని అనుగ్రహించి, తమ కొరతను తీర్చుకున్నారు. ఈ రెండిటి వల్ల నిజంగా లోకం ఉజ్జీవించింది.

## 42)తమ అనంతర కాలంలో సిద్ధాంతప్రవర్తనానికి ఏర్పాటు చేయడం

దేశికులు తమ సన్నిధిలో చిరకాలం ఉండి, సకల విషయాలను గ్రహించి విశేషజ్ఞానాన్ని కలవారై ప్రకాశించే బ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామి ప్రవచనంలో కూడా చాలా చాతుర్యాన్ని కలవారు. వారిని, తమ కుమారులైన వరదాచార్యులవారిని, ఇంకా, జ్ఞానం నిండుగా ఉండే మరి కొంత మంది శిష్యులను తమ కాలానికి తరువాత సంప్రదాయ ప్రవచనం చేసి, రక్షించేటట్లుగా ఆజ్ఞాపించారు.

## 43)దేశికుల అవతార సమాప్తి

శ్రీదేశికులు వేదం చెప్పిన వయస్సు అయిన నూరు సంవత్సరాలకు పైన ఈ విభూతిలో వేంచేసి ఉండి, భగవద్రామానుజ దర్శనాన్ని అభివృద్ధి చేసిన విషయాన్ని, తాము అవతరించిన ప్రయోజనం పరిపూర్ణంగా నెరవేరడానికి గమనించి, ఇక తమ స్వస్థానమైన శ్రీ వైకుంఠాన్ని చేరాలి– అని ఆశపడ్డారు. తమ నిత్యారాధనలో ఉండే వరదరాజ స్వామికి లక్ష్మీహయగ్రీవునకు విశేషమైన ఆరాధనలను చేసి, వారి అనుజ్ఞను పొందారు. భగవద్రామానుజులు, అప్పుళ్ళార్ అనే వీరి పాదుకల తీర్థాన్ని స్వీకరించారు. తమ ఆరాధనలో ఉండే హయగ్రీవస్వామి మూర్తిని, సుదర్శన పాంచజన్యాలను బ్రహ్మతంత్రస్వామి దగ్గర ఇచ్చారు. వరదరాజస్వామి విగ్రహాన్ని, ఇంకొక సుదర్శన పాంచజన్యాలను తమ కుమారులైన వరదాచార్యులవారికి ఇచ్చారు. గరుడుడు తమకు ప్రసాదించిన శ్రీహయగ్రీవ విగ్రహాన్ని, తమ

విగ్రహంతో పాటు ప్రతిష్ఠ చేయమని తమ శిష్యులకు ఆజ్ఞాపించి, , భగవద్రామానుజ పాదుకలను తమ శిరస్సులో ధరించారు. తమ విశ్లేషాన్ని సహించలేక బాధపడే శిష్యులకు తమ శ్రీపాదతీర్థాన్ని ఇచ్చి, తమ విగ్రహాన్ని ఆరాధించుకుంటూ, తమ విశ్లేషాన్ని మరచిపొమ్మని అన్నారు. ఈ విధంగా అన్ని ఏర్పాట్లను చేసి పూర్తి అయిన తరువాత, ఉభయవేదాంత పారాయణాన్ని చెవులారా ఆలకిస్తూ, తమ ఆచార్యులైన అప్పుళ్ళార్ శ్రీచరణాలను స్మరిస్తూ, దేశికులు తిరునాడుకు వేంచేశారు.

## 44)ఉపసంహారం

శ్రీదేశికులు, తమ కాలానికి తరువాత ఉండే చేతనులు తరించడంకోసం అనుగ్రహించిన గ్రంథాలు లెక్కలేనివి. ఉభయవేదాంతాలు, ప్రకరణాలు, స్తోత్రాలు, రహస్యాలు, కావ్యాలు, నాటకాలు, ద్రావిడ ప్రబంధాలు, వ్యాఖ్యానాలు, వాద గ్రంథాలు, రక్షా గ్రంథాలు, అనుష్ఠాన గ్రంథాలు మొదలైన రీతులలో దేశికులు అనుగ్రహించినవి ఒకటి కాదు అనే విషయం సుస్పష్టం. సంస్కృతం, ద్రావిడం, ప్రాకృతం అనే భాషలు మూడిటిలో తమ సూక్తులను అనుగ్రహించడంతో పాటు, తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్ అనుగ్రహించిన ఆఱాయిరప్పడినిగూర్చి మొట్టమొదటగా రచించిన అందమైన అనేక సూక్తులుకూడా సేవించేవారికి మహానందాన్ని కలిగిస్తాయి. తమకు కల జ్ఞానాతిశయంతోను, ప్రవచనంతోను, వాదశక్తితోను శ్రీసూక్తులతోను దేశికుల వలె లోకానికి మహోపకారం చేసిన ఆచార్యులు వారికి

ముందుగాని, తరువాత గానీ ఎవరూ లేరు– అని అనడం ఎవరూ కాదనడానికి సాధ్యం కానిదే తప్ప, అతిశయోక్తి కాదు. కేవలం భక్తితో చెప్పే మాట కాదు. దేశికుల దివ్యసూక్తులను పూర్తిగా, ఏదీ విడవకుండా, ఒక పర్యాయం మాత్రం సేవించి గ్రహించడం అనేది ఒక పూర్ణమైన పురుషుని ఆయుస్సుకు కూడా సాధ్యమేనా? సరిపోతుందా? అనేది సందేహమే. దేశికుల కాలంలో ఈ సూక్తులను ముద్రించే సాధనాలు, ముద్రణ సౌకర్యాలు లేనందున, అప్పుడు ఉండే పెద్దలు వాటిని తాళపత్రాలలో రాసి కొని రక్షించుకొనవలసి వచ్చింది. ఎన్నో వ్యయప్రయాసలను సహించి, సూక్తులను వారు రక్షించుకున్నారు. ఇందువల్ల, అనంతరకాలంలో ఉండే మనవంటివారికి అవి లభించే అవకాశం కలిగింది. ఇంత ప్రయత్నంతో వారు రక్షించినప్పటికీ, దేశికుల గ్రంథాలలో కొన్ని ఈనాడు లుప్తమైపోయాయి. అయినా, చాలవరకు శ్రీసూక్తులు ఈనాడు మనకు లభిస్తున్నాయి. వాటిని అయినా మనం శ్రద్ధతో, ఆసక్తితో, ఆదరంతో సేవించి, మన అరుదైన సిద్ధాంతంలోని గొప్పతనాన్ని, అందులోని విశేషాలను తెలుసుకొని, ఆనందించి, తరించడం– అనేది మన అందరి ప్రధాన కర్తవ్యం. భగవంతుడు మనకు చేసిన ఉపకారాలు అనేకం అయినప్పటికీ, వాటిలో, శ్రీదేశికులను మనకు ఆచార్యులుగా అనుగ్రహించడమే అన్ని ఉపకారాలలోనూ చాలా గొప్పదైన ఉపకారం– అనే విషయాన్ని చక్కగా గ్రహించి, ఆ సర్వేశ్వరుని విషయంలో కృతజ్ఞతలు వ్యక్తం చేస్తూ, ఆనందాన్ని అనుభవిద్దాం. స్వస్తి.